## తృతీయ భాగము







శ్రీ రాజరాజేశ్వరీ నమః

# బ్రహ్మోత్తర ఖండము



## ప్రథమ భాగము

## నైమిశారణ్యము

*“చ అలసుధద్రావి యమర్త్యుడు జరామరభావముఁ జెందు నొక్కఁడే
సలలితశైవకీర్తనము శంభుకథా శ్రవణంబుల న్వీని
శ్చలతనొనర్చు మానవుని సంతతికిం దనకుం దలంపగా
గలుగు సమస్తసౌఖ్యములఖండితవీత జరామరత్వమున్”

శ్రీమంతంబును గోమల కుసుమ విరాజిత వివిధ లతావేల్లిత చూత చందన మందారాది నానావనీరాజ విరాజితంబును, హంస సారస చక్రవాక భరద్వాజ శుకశారికాది పక్షి కలకలారావ కాసార కలితంబును, సింహా శరభ శార్దూల గండకభేరుండ వరాహా సారంగ గజ గవయ రోహిష మహిషాది మృగసంకులంబును గలిగి భువనపావనంబునై యొప్పు నైమిశారణ్యము శౌనకాది మహామునుల ఆశ్రమ భాజితంబై, నిరంతర హోమధూమ నిబిడీకృతమై, సతతాధ్యయనాభ్యా

పన గంభీరస్వర ముఖంబులతోడను, మునిగణ వచన విషయ విభాగ వినిర్ణయ న్యాయనిపుణ విద్వత్సంభాషణములతోడను, సకలశాస్త్ర పురాణేతిహాస కథాశ్రవణ కుతూహలాయత్త చిత్త మునిసత్తమాభి రామంబులతోడను, భూలోకస్వర్గమై విరాజిల్లుచుండెను.

ఆ వనోత్తమంబున కొకనాడు వ్యాసమహర్షి శిష్యుండును, రోమ హర్షుని కుమారుడును నైన సూతమహాముని విచ్చేసెను. అప్పు డా తపోవనమునందలి ఋషిసత్తములెల్లరు అమందానందమును జెంది, విద్వజ్జనమాన్యుండగు ఆ సూతమహామునికి అర్ఘ్యపాద్యాదు లొసంగి అతిథి సత్కారములం గావించిరి.

పిమ్మట వారు సూతునితో "మహాత్మా! నీవు విద్యాసార్వ భౌముండైన వేదవ్యాసమహామునీంద్రునకు ప్రియశిష్యుండవై, ఆ ముని సత్తమునివలన సకల వేదపురాణేతిహాసంబు లందును కుశలమతివైన మానితగుణసౌజన్యుడవైతివి. నీకు సమానులైన మానవులు ఈ భూమి యందు లేరు. నీవు నిక్కముగ ధన్యుడవు. నీ వలన మే మెల్లరము సర్వధర్మములను, వివిధ పురాణేతిహాసములను, పవిత్రవంతములైన పెక్కు రాజన్యుల చరిత్రంబులను, శ్రీమన్నారాయణుని సత్కథలను వినియుంటిమి. ఇంక శ్రీ పరమేశ్వరునిగూర్చి విన కుతూహలమును గలిగియుంటిమి. యముని జయించి బాలుడగు మార్కండేయునకు దీర్ఘాయు వొసంగినట్టియు, భక్తుండగు పార్థునకు పాశుపతాస్త్రము నిచ్చి కౌరవనిర్మూలమునందు సహాయ మొనరించినట్టియు, భక్తవత్సలు డగుటచే బాణాసురుని యింటం గావలి యుండినట్టియు, పరమపవిత్రుం డగు ఆ చంద్రశేఖరుని ఆశ్రయించినవారికి సకలశుభంబులు గలుగును. ఆయన భక్తులపాలిటి కల్పద్రుమంబనజెల్లును గనుక స్థావర జంగమా త్మకమైనజగమునంత నేలుచుండిన ఆగౌరీనాథుని చరిత్రంబును, ఆయన పత్నీకమ ప్రభావంబును, శివభక్తులయొక్క లక్షణంబులను, మా కెరిం

గించి మా హృదయములను రంజింపఁజేయ ప్రార్థించుచుంటిమి" అని నుడివిరి.

సూతుండును పరమానందమునుఁ జెంది "మునిశ్రేష్టులారా! సర్వజ్ఞులైన మీకు దెలియని ధర్మశాస్త్ర పురాణేతిహాసంబులు లేవు. అయినను మీరు అడిగియుంటిరి గాన అందులకు నేను విధేయుడనై చెప్పవలసియున్నది. సావధానులరై వినుఁడు" అని బలికి గురుదేవునకు వందనంబు గావించి మంత్రోత్కృష్టంబైన పంచాక్షరిని గూర్చి ఇట్లు చెప్పఁదొడఁగెను.

# 2

## పంచాక్షరీ ప్రభావము

ఓ మునిశ్రేష్ఠులారా! ఈ జగమందు పరమేశ్వరప్రియంబై, మంత్రరాజంబై వెలయుచున్న పంచాక్షరియొక్క మహాత్వము లెంచగ నెవ్వరికినిశక్యంబుగాదు. ఆ మహామంత్రంబును అభీష్టసిద్ధికై శ్రీమన్నా రాయణుఁడు, దేవేంద్రుఁడు, చతుర్ముఖుఁడు మొదలుగాగల వారెల్లరు జపియించుచుందురు. ఆ మంత్రమును పుణ్యకాలములగు వ్యాస పూర్ణిమ, యేకాదశి, ద్వాదశి, భానువారము, సంక్రమణము, సూర్య చంద్ర గ్రహణములందు మధురా ద్వారవతి చిదంబర కురు క్షేత్రము మిధిల అవంతి వారణావతము గయ ప్రయాగ రామేశ్వర మాదిగాగల పుణ్యక్షేత్రములందును, సింధు యమున సరస్వతి వేణి తుంగభద్ర నర్మద బ్రహ్మపుత్ర గౌతమి మణికర్ణిక మొదలుగాగల నదీ తీరములందును, పవిత్ర పర్వతక్షేత్రములందును, తపోధనులగు మునీ శ్వరుల వలనను, కామ క్రోధ మద మాత్సర్యాదులనుండి విముక్తులై శివపూజాపరులై శాంతిగుణులై స్థిరబుద్ధి గలిగి శివప్రియులగు పుణ్యా

పురుషులవలనను, ఆత్మశుద్ధి గలిగి మాత్సర్యగర్వములను వీడి గుణవంతులైనవారు పంచాక్షరీమంత్రమును ఉపదేశమును పొంద అర్హులగుదురు. అట్టివారిని భక్తిశ్రద్ధలతో ఆచరణయందు బెట్టుకొనియుండు మానవుని మహిమలను వేనోళ్ల ఆదిశేషుడైనను పొగడలేడు.

మరియు పుణ్యక్షేత్రమునందు ఐక్యమునొందుచుండిన సాధుజనుని వలన ఆ శాంకరీమహామంత్రమును ఏ మానవుడైనను ఉపదేశమును పొందిన సముద్రపు అడుగున యున్న ముత్యపుచిప్పల యందు బడు స్వాతివాన వలె ఆ మానవుని శుభమోక్షములు సార్థకమును జెందును.

సల్లలితమగు ఈ మంత్రరాజమును మానవులు ఉపదేశమును పొంది హోమతర్పణ దీక్షాదులు లేకున్నను జపమొనర్చి పాపరహితులై ఇష్టార్థములను బడయగలరు.

పూర్వకృతపాపములను పంచమహాపాతకములను హరియించునదియు, ధర్మార్థ కామ మోక్షములను అతిదక్షతగ నిచ్చునట్టియు, కౌశికాగస్త్యాది ఘన మునీంద్రులయొక్క ఘనతను విశదపరచుచున్నట్టియు, జపపరాయణులకును, సాధుజనులకును వక్షయదశ్రపదంబగునట్టియు, మిక్కిలి శ్రేష్ఠమైన యీ పంచాక్షరీ మంత్రరాజము పూర్వపుణ్యముల వలన లభించినదని వేదములు తెలుపుచుండెను.

ఈ మంత్రమును ప్రణవము అయినట్టి 'ఓం' అనుశబ్దముతో జపియించిన అయ్యది షడక్షరమగును. మీరయ్యది శ్రద్ధాభక్తులతో యెల్లప్పుడును జపియించిన భక్తవత్సలుడగు ఆ పరమశివుడు ప్రీతిజెందును. కనుక ఆ మంత్రశ్రేష్ఠము భక్తజనులకు పుణ్యలోకములను చూపెట్టునట్టిదై ఉత్తమమైన మార్గదర్శిగను, సంసార సాగరమునందు ఈదులాడుచు దరిజేర ప్రయత్నించువారిని కష్టములనుండి

తొలగించుటకు అన్వేషణాయోగ్యముగను, స్వచ్ఛమైన సుఖములనిచ్చి ఆత్మానందమును కలుగజేసి ఫలంబునిచ్చు మంత్రంబులలో కెల్ల ఉన్నతమై యలరుచున్న ఈ శైవషడక్షరము నిత్యము అనేక పూజ్యులచే స్మరింపబడును.

మరియు నక్షత్రమండల మధ్యమందు విరాజిల్లు చంద్రునివలెను, బహువృక్షమధ్యమందు కల్పవృక్షమువలెను, పర్వతముల మధ్యమందు కనకగిరివలెను ఈ షడక్షరమంత్రము మంత్రములమధ్య శ్రేష్ఠతరమై యొప్పును.

" శా. మంత్రంబు శివస్వరూపమును నారీభూత తాపత్రయం
బామోదప్రద మార్యసమ్మతము తిర్యాగ్ర్యప్రదీపంబు శ్రీ
రామనాగ స్త్య మహర్షి లోకభజనార్హంబైన పంచాక్షర
శ్రీమంత్రంబున నమశ్శివాయయను చున్ జింతింపుడ్రశాంతమునీ

# 3
## కాశీపురము

దిగంత విశ్రాంతకీర్తియగు భరతవర్షంబున బరమసుఖాస్పదంబై, సకల సంపత్సమృద్ధంబగు కాశీపురంబను మహాక్షేత్రము గంగాతరంగిణీ తటంబున విరాజిల్లుచుండెను. ఆ పవిత్రనదీజలము మాధుర్యంబున జెరకుపాలను నిర్మలత్వంబున మౌక్తికరాజంబులను పరిహసించుచుండెను. ఆ నగరము నారికేళ క్రముక పనస జంబీర ఖర్జూర మాలూర సౌవీర చందన మందార జంబూకదంబాది తరుషండంబులతోడనున్న, మాలతీ మల్లికా శ్యామంతి కురంటక చంపకాద్యనేక పుష్పవాటికా శోభితంబైన ఉద్యానవనములతోడనున్న శోభిల్లుచుండును. ఆ నదీతీర మనుదినము బక బలాహ చక్రవాక కోయష్టిక

కారండవ మొదలుగా గల పక్షిసమూహాయమానపకు విహారసౌభాగ్యమై మంజుల నిస్వన మండితంబై, విశ్వేశ్వర మహోత్సవ సందర్శనార్థమై యరుదెంచు చతుర్విధ వర్ణాశ్రమ జనుల కలకలారావసమన్వితంబై, మృదంగ పటహ నిస్సాన వేణువీణాది వాద్యప్రాద్యంబునై, బ్రహ్మ లోకమువలె వేదాధ్యయనములతోడను, మహేంద్రభవనమునుబోలె బహు విబుధాకీర్తనములతోడను, మానస సరోవరమువలె రాజ హంసలతోడను, చంద్రమండలమును పోలె నమృతాస్పదంబై నారా యణాశ్రమంబునుంబోలె జగత్పావనంబై యొప్పుచుండెను.

ఈ భూలోకమందున్న ముక్తిదాయకంబులై యొప్పు నగరంబు లన్నిటియందు ప్రథమగణ్యంబై కాశీపురము మిక్కిలి సిరిసంపదలతో తులతూగుచుండెను. అయ్యాది బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మొదలుగా గల వారెల్లరకు సేవ్యసౌభాగ్యమై యలరారుచుండెను. మరియు దర్శనమాత్రమున పంచమహాపాతములనెల్ల భస్మీభూతము గావించుచు కైవల్యసంధాయకంబై, భువనప్రసిద్ధమై ప్రళయకాలమునందు కాల భైరవుని మొలయం దుంచబడిన త్రిశూలమువలె ప్రకాశించు హిమా లయ కటియందు స్థిరముగ సంస్థాపితంబు గావింపఁబడెను. ఆ క్షేత్ర మాహాత్మ్యము నీలకంఠునికిఁ దక్క వనజభవునికైనను, గౌళికునికైనను, మరెవ్వరికైననుఁ జెప్పశక్యముగాదు. ఆ క్షేత్రమందు కాలభైరవుఁడు గణాధిపతి,బిందుమాధవుఁడు,విశ్వనాథుఁడు, పార్వతీదేవి వెలసియుండిరి.

"నే నెప్పుడు కాశికాపురికేగి గంగాస్నాన మాచరించి వేడ్క తో విశ్వనాథునింగాంచి యింపుమీరగా కాలభైరవేశ్వరునకు మ్రొక్కి మోక్షమునొందుదును" అని కోరికఁ గలిగి ఆతురతతో యుండు మాన వులకు ఆ పరమేశ్వరుడు అఖండసంపదలను కలుగజేయును.

అన్నగరంబునందుగల సౌధములు హాటక వజ్రమణి ప్రబలం బ్రబద్ధ ప్రములై, నభశ్చుంబిత సంవరణప్రావృతంబులై, దిననాథ రజనీ నాథుల శాటల కాటంకము గలిగించుచున్నవో యనఁ జూపరులకు వింత గలిగించుచుండును. మరియు సకలవేదశాస్త్ర పురాణాది విద్యా గరిష్ఠులైన విద్వాంసప్రవరులతోడను, గగనతలంబునం దమగిరి వెన్నచ్చి పారగ పురహారునైన నోడింపఁగల సమర్థులగు మహాయో ధులతోడను, కోటికి పడగలెత్తి అలకాధిపతినైన నిరసింపగల వణి క్ప్రుంగవులతోడను, మిన్నులరాయు ధాన్యపురాసులు గల్గి బలువైన మొత్తని పూతస్వాంతులగు సేద్యగాండ్రతోడను, వేగతిరస్కృత పవ మానస ఘోటకరాజంబులతోడను, నవిరళ మదధారాసిక్త మార్గం బులు గల వారణశ్రేష్ఠములతోడను, ఘోరరణ రంగోద్భటులగు వీర భటులతోడను, శైలోపములై ప్రవిమల కేతుయుక్తములగు రథాంగ పంక్తులతోడను, నర్తనయందు రంభోర్వశీ మేనకాదులనైన వ్రీడబుచ్చు రత్నహాటక మణిమయ భూషణాలంకృతులగు వేశ్యాంగనలతోడను, భూకాంతకు మేలిభూషణంబో యన ప్రశస్తవస్తు విసరనికేతనంబై యా కాశికాపురంబు వరలుచుండెను.

ఆ పట్టణమునకు సకలలక్షణసంపన్నుఁడగు ఒక రాజన్యచూడా మణి యేలికయై దుర్మదాంధులగు వైరిధరాదురంధరుల నాజిరంగం బులఁ బరాజితులంజేసి తనప్రతాపమును వెల్లడిజేయుచు, రాజ్యమందు చోర యీతి బాధలు లేకుండ యేలుచుండెను. మరియు ఆ నృపా లుఁడు నిరంతరము దైవకార్యములందును, దానధర్మంబులందును, నిమగ్నుఁడై ధనరాసులకు మహోత్సవమును జరుపుచుండెను. ఈ విధ ముగ ఆ రాజన్యుఁడు శ్రీ విశ్వేశ్వరుని కరుణచే బుధులెల్లరు నుతింప మహా వైభవముతో దేవేంద్రునివలె రాజ్యము నేలుచుండెను.

# 4

## కళావతి

ఇంతటి మహావైభవమును ననుభవించుచున్నను నీరాజచంద్రుని బిడ్డలులేని కొరంత బాధించుచుండెను. అంతులకాంతయు అతినిష్ఠతో భార్యాసమేతుండై పార్వతీపరమేశ్వరుల వ్రతములను శుభప్రదముగ నాచరింపుచు విరివిగా దానధర్మములను చేయుచు, నిజసదనమున కరుదెంచు ఋషీశ్వరులకు సేవలుజేయుచు, భక్తియుక్తుండై యుండ ఆ పరమేశ్వరుని కృపచే యెల్లరకు సంతసము గొల్పునట్లు నా యింతి గర్భమును దాల్చెను. మణిభూషణాదులెల్ల బిగువయ్యెను. నడుము లావయ్యెను. నిద్దుర హెచ్చెను. దేహకాంతి మించెను, ఆహారమందు నిష్టము లేనిదయ్యెను. గోరిక లుదయించుచుండెను. ఇట్లు ఆ తరుణీరత్నము నానాటికిని యంతర్వత్నియై తొమ్మిదినెలలు నిండ పదవమాసమున గ్రహములన్నియు యొక్క శుభరాశియందుండ రాజాంతఃపురమున నేగాక పట్టణమునందలి జనులెల్లరకు ఆహ్లాదము గొల్పునట్లు లక్షణవతియగు ఒక కన్యక జన్మించెను.

ఇట్లుదయించిన ఆ కన్యకారత్నమునకు జాతకకర్మాది సంస్కారంబులెల్ల నిర్వర్తించి యా భూపాలుండు పరమానందముతో విశ్వేశ్వరుని గొల్చుచు శివభక్తులకు భూహిరణ్యాది దానంబులొసగావించి హైమవతిని గాంచిన హిమవంతుని పగిది సంతుష్టాంతరంగుండై యుండెను. ఒక శుభముహూర్తమున ఆ కన్యకాలలామ శ్రీమతియు, ధీమతియు, భానుమతియు నగుటంజేసి కళావతి యని నామకరణమిడెను. ఇట్లు ఆ బింబాధరి దిన దిన ప్రవర్ధమానయై ఆమెయొక్క నెమలిపింఛమును మించు తుమ్మెదరెక్కలవంటి కురులును, చంద్రబింబమును కళంకము [illegible] వోనాడు. శ్రీకారముల శ్రీహరించు కర్ణంబులును, కమల

దళంబుల దెగడు నేత్రములును, చంపకంబుల బ్రద్దలుచేయు నాశిక యును, బింబముల విరక్తిజేయు నోష్ఠంబును, కుందకుట్మంబుల పిద ళించు దంతపంక్తియు, దర్పణంబుల దర్పంబడంచెడు చెక్కులును, శంఖంబుల కీచుమనిపించు గళంబును, బ్రహ్మయొక్క సృష్టిని ఆశ్చ ర్యంబు గొల్పుచుండెను.

ఆయువు శైశవమునందే అతి మేధావంతురాలై కావ్యనాటకా లంకారముల నెల్ల భాసంబుగాఎంచి విద్యాధరియై తల్లిదండ్రుల హృద యమును రంజింపఁజేయుచుండెను. ఇట్లుండ నొకనాఁడు ఘనతపోవిలా సుఁడై యోగాభ్యాసుఁడైన దూర్వాసమహాముని రాజసభ కరుదెం చెను. సాక్షాత్తు శంకరునిపగిది యరుదెంచుచున్న యా మహామునిని గాంచి యా నృపాలుఁడు తన యదృష్టమున కెంతయు సంతసించి మంత్రివర్గంబుతోడను, విద్వాంసులతోడను యెదురేగి అతిథిని అభ్యు త్థానపూర్వకముగా గొనివచ్చి అర్ఘ్యపాద్యంబు లొసంగి యర్హాసన మున కూర్చుండ నియమించి యభివాదన మొనర్చి మృదువచనము లతో భాషింప మొదలిడెను.

"ఓ యోగికులచంద్రా! చిరకాలము తప మాచరించి యనేక పుణ్యతీర్థములను సేవించి దేవస్వరూపులై మహర్షిశ్రేష్ఠులైన మీా చరణసేవచే సత్వరమార్గంబున మోక్షప్రాప్తిని బొందితిని. మరియు నో మునిసార్వభౌమా! తమ రరుదెంచినందున నా గృహమెల్ల పావనంబయ్యెను. నా కామితములెల్ల ఫలించెను. కడు ధన్యు మాన్యుడఁనైతిని. నా మనం బెంతయు సంతసముగ నుండెను" అని నుడువుచు ఆ మునిసత్తమునకు సతీకుమారీ సహితుఁడై పూజ లొనర్చి షడ్రసముల మృష్టాన్నపాన సంతృప్తుని గావించి పాదసేవ యొనర్చెను.

ఇవ్విధంబున పరిచర్య లొనరింపుచున్న రాజునుఁ గని ఆ మునీ శ్వరుఁడు పరమానంద కందళిత హృదయారవిందుఁడై "ఓ నృపసార్వ

భామా! నీయొక్క రాష్ట్రమందున్న దుర్గములు సౌధములు బలముగ నున్నవిగదా? భద్రాశ్వబలగజములు గోగణంబులు ఆరోగ్యముగ నున్నవిగదా? నీవును భార్యాబిడ్డలతోడను, బంధువర్గంబుతోడను సుఖివై పూర్ణభోగంబులను పొందుచుంటివిగదా? నీ రాజ్యమం దెట్టి బాధలును లేవుకదా?" అని ప్రియమూరఁ బలుక ఆ నృపచంద్రుఁడును మహావేశముతో "మీయొక్క ఘనతర కారుణ్యముచే సర్వము కుశలముగ యున్నది. ఓ మునిచంద్రా! నాయొక్కయు నా రాజ్యము యొక్కయు క్షేమ మారసి మదీయ గృహమందు కొన్ని దినంబులు వసించి నా కనులకు పండువొనరింపుము" అని ప్రార్థింప దూర్వాసుఁడు అందుల కియ్యకొనెను. అప్పుడా ధరణీపతి ఉప్పొంగుచు తన కుమారీరత్నమగు కళావతినిఁ గాంచి "అమ్మా! ఈ మహాత్ముఁడు మన గృహమందున్నంతకాలము నీవు అతి వినయముతో సమ్మతమగు భోజనపానములతో సత్కరించి పూజించుచుండెదవేని తన హృదయంబునందు సంతసిల్లి జగమునంతను సంతసింపఁజేయును. అప్పుడు మన యభీష్టము లెల్ల శుభప్రదంబుగ సిద్ధించును" అని ప్రియమారఁ బలుక కళావతి అందులకు వినయవతియై సమ్మతించి, ఆ మునిచంద్రుని సుందర వనమధ్యమందు నిర్మింపఁబడియున్న ఒక దివ్యభవనంబునకు గొనిపోయి అందు నివాస మేర్పరచెను.

పిదప రాజకుమారియగు కళావతి ఆ మునీంద్రుని యనుదినము సంధ్యాకాలములందు పుణ్యోదకముతో స్నాన మాచరింపఁజేసి, విలువగల మధుపర్కములను గట్టనిచ్చి, సువర్ణాసనముపై కూర్చుండ నియమించి, మంచి పరిమళముగల సుగంధమును మేనునకుఁబూసి, బిల్వదళములచేతనున్నూ, పుష్పములచేతనున్నూ యా మహానుభావుని పాదపద్మములను పూజించి పరిమళ దీప ధూపంబుల నొసఁగి షడ్రసోపేతముగ భోజనమిడి పరితుష్టునిఁ గావింపఁజేసి శీతలజలముతో అతని

దాహమును దీర్చి, హస్తపాదములను శుభ్రపరచి, హిమాంబువులను ఆచమింపఁజేసి, హంసతూలికాతల్పముపై శయనింపఁజేసి, అతని పాదములను తన మృదు హస్తములతో ఒత్తి యిట్లు అనేకవిధముల వినయ వతియై ఆరాధించుచుండెను. ఈ రీతిగ కొన్నిదినములు గడ చెను. మౌని కళావతిపై కారుణ్యము వహించి ముదముతో "బాలా మణీ! నీ సుశీలవృత్తములకు వినయములకు నీ వివేకమునకు పరమానం దముఁజెందితిని గనుక నీకు పంచాక్షరీమంత్రమును యుపదేశించెద శ్రద్ధ గొనుము" అని బలికి ఆ క్షణముననే కృపాకలితమగు కటాక్షామృత దృష్టిని యా బింబాధరిపైఁ బరపి పంచాక్షరి నుపదేశించి యథేచ్ఛగా రాజాంతఃపురమును విడిచి వెడలెను.

## 5

## కళావతీ పరిణయము

మహామునీంద్రుఁ డగు దూర్వాసునిచే పంచాక్షరీ మంత్రోప దేశంబునుఁ బొంది, కన్యకాలలామ యగు కళావతి విధూతకల్మషయై, వినిర్మల స్వాంతయై, సదాచారపవిత్రయై, పుణ్యచరిత్రయై, నిరతంబును ఆ మంత్రానుష్ఠమందు నిమగ్నయై యుండెను. ఇట్లుండ కొంతకాల మున నవయౌవనవతియై, సకలసద్గుణవతియై, సర్వజనమాన్యయై సౌజన్యధన్యయై యున్న యా కన్యకకు వరుని అన్వేషించుటకై రాజ న్యుఁడు పౌరులను నియమించెను.

మహావిద్వాంసులతోడను, సకలవైభవములతోడను, ధన కనక వస్తు వాహనములతోడను, విరాజిల్లుచున్న మధురాపురి యను పట్టణ మొకటి కలదు. అయ్యది మదనప్రోజ్జ్వల విగ్రహయువకుఁడై మృదు సామ్రాజ్యధురీణుఁడై యదువంశచంద్రుఁ డనదగు దాశార్హుఁడను రాజు

మహాప్రతాపముతో పరిపాలనాదక్షుండై శౌర్య ధైర్యగుణములందు నిధియై ప్రజలచే నుతింపబడుచుండెను.

ఆతని గుణగణముల నన్నిటిని విన్నవాడై కాశీపురాధిపతి దాశార్హుని గౌరవపూర్వకముగ బిలిపించి సమ్మతినిం గొనినపిదప శుభ ముహూర్తమున వేదోక్తవిధిని సకలజన నయనోత్సవంబుగా తన కుమార్తెయగు కళావతిని వానికిచ్చి పాణిగ్రహణముంజేసి హయ గజ స్యందన విలాసినీ శతంబులను, గోసహస్రంబులును, అపరిమితంబు లైన సువర్ణ మణి మయాంబరాభరణంబులు మొదలుగా గల సమస్త వస్తు సముదాయమునిచ్చి ఆ వధూవరులను మధురాపురికి సాగనంపెను.

వివిధాలంకారశోభితం బగు మధురాపురికి దాశార్హమహీ పాలుండు సతీసమేతుండై తూర్యఘోషణంబులు చెలంగ విచ్చేసి రత్న స్తంభ విభ్రాజితంబును, హరిన్మణిస్థాపిత ద్వారగేహాళీ నిర్మితంబును, నవాశ్వత్థ రసాల పల్లవతోరణ మాలికాకృతంబగు నిజశుద్ధాంత భవన మునకు సకలకళ్యాణ మహోత్సవంబుతో ప్రవేశించి సంతర్పణంబులం గావించి, నిజసామ్రాజ్యభోగంబు లనుభవించుచుండెను.

పిమ్మట దేవేంద్రభోగముల ననుభవించు ఆ దాశార్హ మహీపా లుండు ఒక శుభముహూర్తమున నాటిరాత్రి నిజకాంతా ప్రథమసంగ మాపేక్షుండై కమలాస్త్రప్రభ గల్గునట్టి శయనాగారమున మల్లికాసుమ శయ్యాయందు మన్మథునివలె శయనించియుండెను. అప్పుడు రాజమంది రమున విడిచిపెట్టంబడిన లేడిపగిది, మన్మథుని రాచిలుకవలె, నక్షత్ర మండలమున నుండి జారిన నక్షత్రము భాతి, మయునిచే నిర్మింపంబడిన రత్నమయ పుష్పకమువలె దీపించు మోహినీదేవిలీల, నిర్మల సువర్ణ రత్న మాణిక్యఖచిత భూషణంబులను దాల్చి కళావతి సహజవ్రీడతో యరుదెంచి జీవితేశ్వరునిముందు నిలచియుండెను. ఇట్లు తన సామీప్య మున నిలచియున్న సౌందర్యవతిని జూచి దాశార్హుండు సంగమాశక్తి

కలవాఁడై యెన్నివిధముల బిలిచినను బలుకకుండుటచే యామెను కరముబట్టి దరికిదీసికొన నుద్యుక్తుఁడయ్యెను. అప్పుడా కళావతి పతి సంభ్రమమును గ్రహించినదై "ఆర్యా! నన్నంటవలదు. మీరు వారకాంతాది కామినులతో వర్తింపుచు, నిర్మలాచారంబు లేమియు లేక మధుమాంస ద్రవ్యలోలురై మెలంగుచుండిరి. వ్రతము లాచరించు యింతియు, యుపవాసదీక్షయందున్న వధూటియు, గర్భిణీసతియు, రోగపీడితయు సంగమమున కయోగ్యులు. ఇప్పుడు నేను శంకరవ్రత జపమంత్రతంత్రములందు వన్నెకెక్కి పరమపవిత్రురాలనై యుంటిని. అట్టి నన్ను మీవంటి అనాచారపరులు అంట శక్యముగాదు గనుక దయచేసి తొలగిపొండు" అని పలికినంతనే ఆ రాజన్యుఁడు అత్యంతాశ్చర్యంబును బొంది భయోత్కంపముల నెద్దియు నుడువుటకుఁ దోచక కొంతతడవు మిన్నకుండెను. కళావతిపై మోహభ్రాంతి కలవాఁడగుటచే ఆ మహీపాలుఁడు కొంతధైర్యమును చిక్కఁబట్టినవాఁడై "ప్రాణేశ్వరీ! ఇదియేమి? నీ విట్లు నన్ను నిందించుట న్యాయమా? ఎందైన దంపతులపట్ల నిట్టి నిబంధనలుండునా? సతీపతులు కలసియుండునప్పుడు కలుగు సుఖమును మించినది లేదని నీవు విన లేదా?" అని పలికిన ప్రాణవల్లభునకు కళావతి "ఆర్యపుత్రా! పరమ తపోధనుఁడును, అత్రిమహాముని పుత్రుఁడును, త్రినేత్రాంశావతారుండును, మంత్రపురాణాగమ తత్త్వవేదియు నగు దూర్వాసమహర్షి యొకప్పుడు నా తండ్రి సదనమున కరుదెంచి నాచే పరిచర్యలను బొంది ప్రీతిఁజెందినవాఁడై దయతో నాకు శైవ పంచాక్షరీ మంత్రమును యుపదేశించెను. నే నద్దానిని విధ్యుక్తంబుగ జపియించి పవిత్రనైతిని. మీరు సదాచారులు కారు. దురాచారవృత్తిని గలిగిన మీరు సద్గురునియొక్క సేవ యొనరించి సదుపదేశమును పొందిన మేలుచేకూరును" అని పలుక ఆనృపాలుఁడు పంచాక్షరీ మంత్రమును తన కుపదేశించి పవిత్రునిగ యొనరింపుమని

నుడువ కళావతి ప్రౌఢవాక్యములతో "నాథా! మీకు నేను భార్యను. నావలన మీరు అట్టి మహామంత్రము నుపదేశమును పొందినయెడల మీకీర్తికి లోపము కలుగును గనుక మీరు మీ కులగురువగు గర్గ మునీశ్వరునకు ప్రణమిల్లి పూజించిన, ఆ మహాత్ముండు ఆ పవిత్రపంచాక్షరిని మీకుపదేశించి కృతపుణ్యునిగ యొనరించును" అని పలికినంతనే దాశార్హుండు ఆనందించి పరులెవ్వరెరుంగకుండునట్లు భార్యాసమేతుండై గర్గమునీశ్వరుని ఆశ్రమమునకుఁ జని ఆ మునీశ్వరుని యచ్చటఁ గాంచి, యాతని పాదములకు ప్రణమిల్లిరి. భయభక్తులతో నడిరేయి యచ్చటి కరుదెంచిన వారలను కనుగొని యా సంయమీంద్రుఁడు కరుణార్ద్రహృదయుండై "ఓ రాజేంద్రా! ఈ యర్థరాత్రమునందు శయనాగారము విడచి మీరిచ్చటికి వచ్చిన కారణమేమి?" అని ఘనముగ భాషించెను.

అప్పుడు కళావతి "మహాత్మా! ఈ మహీపాలుఁడు పాకృత పురుషుండును సదాచార వర్జితుండును నైయుండెను. గావున మీర లిప్పు డీ నృపాలుని కటాక్షించి భోగమోక్షప్రదంబును, నిహపర సాధకంబును, బరమపవిత్రంబును, మంత్రరాజంబు నైన శైవ పంచాక్షరం బుపదేశించిన యితండు కృతార్థుండగును. ప్రారబ్ధంబులైన దుష్కర్మంబులుఁ దొలంగి సకలశుభంబులు ప్రాప్తించునట్లు ప్రసాదింపుఁడు" అని ప్రార్థించెను. అప్పుడా యోగీశ్వరుఁడు అమ్మానినియొక్క మృదు మధుర భాషణంబుల కలరుచు యట్లాచరింప సమ్మతించెను.

అప్పు డా ఋషిసత్తముఁ డా రాజదంపతులను యమునానదీ సమీపమునకుఁ గొనిపోయి, కళావతిని నదీతీరమునందే యుండ నియమించి, భూపాలుని సంకల్పపూర్వకంబుగ నఘమర్షణస్నాన మాచరింపఁజేసి, లలితమైన విభూతిని ఫాలతలమున నలది సిద్ధాసనస్థునిగఁజేసి తన పాదతలంబున యాతని హస్తంబులనునిచి విధ్యుక్తమార్గమున

శైవపంచాక్షరోపదేశంబు నొనరించెను. పిమ్మట యా ధరణీపతి మహేశ్వరుని మదిలోఁ దలంచుచు జపముఁ జేయుచు నుండెను. అట్లు గిరిజాధీశుని మనస్సునందు మహానిష్ఠతో భూకాంతుఁడు జపియింపఁగా ఆతనిని యాశ్రయించుకొని యున్న పాపంబు లనేకములు పైకెగసి వాయసంబులుగ మారి రెక్కలు దగ్ధములు కాఁగా కాకారముఁ జేయుచు ఆ యమునానది మధ్యమందుఁ బడెను.

అప్పు డద్దానికి మహాశ్చర్యమును జెంది నృపాలుఁడు గురువు వద్దకుఁ జని ఆతనికి వందన మాచరించి జరిగిన చోద్యమునెల్ల నివేదించెను. మునివర్యుండును సంతసమంది "ఓ భూవల్లభా! నీవు పూర్వభవ కృతంబై వెలయు కలుషంబులన్నియు పంచాక్షరీ ప్రభావంబుచే నిన్నువిడచి గడ్డిపోచవలె దగ్ధములై నశించెను. కనుక సదాశివానుగ్రహమున నీ మంత్రరాజంబు ప్రాప్తంబయ్యెను. దానివలన నీవు ధర్మశీలుండవైతివి. ఇంకనీవు దేవీసహితుండవై సమ్మదంబున సుఖమును బడయుఁగలవు. మరియు నీయొక్క వంశంబున భగవంతుఁడైన శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణభగవానుఁడై యవతరించి మీ కులంబును పావనం బొనరించును" అని పలికి యా రాజదంపతుల నాశీర్వదించి వారలను తన ఆశ్రమమునకుఁ దోడ్కొనివచ్చి పిమ్మట రాజధానికి సాగనంపెను.

అప్పు డా రాజదంపతులు రాజహంసలవలె సముల్లసతేజముతో తమ సౌధమునకు విచ్చేసి తదుపరి పరస్పర ప్రేమానురాగంబుల సురుచిర సౌఖ్యముల ననుభవింపుచు పరిపూర్ణ మనోరథులై యుండిరి. మరియు వా రనుదినము వందిమాగధుల కైవారంబులతో నిదురనుండి మేల్కాంచి నిర్మలచిత్త మనస్కులరై విధ్యుక్తమార్గమందు స్నానమాచరించి పంచాక్షరిని జపియించి దేవపూజ నొనరించి, శివభక్తులను మృష్టాన్న పాన సంతృప్తులను గావించి వర్ణాశ్రమ ధర్మములను దప్పకుండ ధారుణీతలమును పాలించుచుండెను.

# 6

## మిత్రసహ మహీపాలుఁడు

పంచాక్షరీ మంత్రంబును, యా మంత్రరాజముయొక్క మహిమయు శౌనకాది మహామునులకెల్ల చెప్పిన పిదప వారియొక్క కోరిక ననుసరించి సూతమహర్షి శివమహాత్మ్యంబును చెప్పఁదొడంగెను. "ఓ మునివరులారా! పాపంబులన్నిటిని నశింపఁజేసి, ముక్తిమార్గమునకు మార్గదర్శియై, దివ్యభోగములకు సాధనకారియై, ఆపదలనెల్లఁ బాపి జయప్రదమును గొల్పు రమ్యతరమైన శివలోచనుని మహాత్మ్యము నెన్నఁగ నెవ్వరికిని శక్యముగాదు. అట్టిది ఆయుర్వర్ధనమై రుజాపహరణమై ఆరోగ్యసంధాయియై శ్రేయసాధకమై తపోఫలమును జేకూర్చుచు క్షేమకరంబై యెల్లప్పుడును ప్రాయశ్చిత్తములేని పాపములఁ బాపునట్టి పుణ్యప్రదంబైన ఆ పరమశివుని గాధనంతయు ప్రమోదపూర్వకముగా మీకెల్లరకు వినిపించెదను. ఉత్తమంబైన నుత్తరాయణంబున పుణ్యప్రదంబైన మాఘకృష్ణ చతుర్ధశియందు వేకువఝామునసే లేచి విధియుక్తముగ స్నానమాచరించి దినమంతయు నుపవాస మొనరించి భయభక్తులతో పరమశివునకు ఆగమాభిషేకము లొనరించి బిల్వదళములతో పూజించి రాత్రియంతయు శైవకథా శ్రవణముతో జాగర మొనర్చవలెను. బ్రహ్మవిష్ణు మొదలుగాఁగలవారు, సంయమివరుల విమలాభిషేక పూజాక్రమముల వ్రతము నాచరించి యభీష్టసిద్ధిని బడయుచుండిరి" అనిచెప్పి ఒక యితిహాసమును చెప్పఁదొడంగెను.

సకలసంపదలకు నాకరంబై కరఁబరారు ధరణీరమణికి నాభరణాయమానంబై యీ భరతఖండమున సంపాదిత సుకృత విసర యగు సరయూనదీ పరిసరంబున నిఖిలసిద్ధ జనారాధ్యమై సాకేతంబను పురంబొండు కలదు. అయ్యది మిహికులవరేణ్యులగు రాజన్యులకెల్ల బరం

పరానుభూతంబై యుండును. అట్టి పట్టణంబునకు నగవమణి గోత్ర గ్రామణియు రాజన్యచూడామణియు నైన మిత్రసహుండు యేలికయై ధరాపరిపాలనంబుఁ గావించుచుండెను. ఆ నృపాలుఁ డెల్లప్పుడు ఘోర వనముల కేగి దారుణంబులైన క్రూరమృగంబులనెల్లఁ గూల్చుచు సంయమీంద్రులకు సౌఖ్యమును జేకూర్చుచుండెను.

ఇట్లు వనంబులోపల గలుగు దుష్టమృగంబుల సమయించుచున్న సమయంబున నొకరక్కసునిఁ గని వాని నొక్క నిశితశరంబున విగత ప్రాణుని గావించెను. అప్పుడు వాని సహోదరుఁడు మాయచేసి సూప కారి వేషమును దాల్చి ఆ రాజన్యునికడకు వచ్చి బద్ధాంజలియై తాను నానావిధ విచిత్ర పాకక్రియా నిపుణుండవనియు, తన్ను సేవింపఁగోరి యట కరుదెంచితి ననియు విన్నవించెను. రాజయ్యది యథార్థమని తలంచి వానిని దోడ్కొనివచ్చి తన మందిరంబున సూపకారిగ నియ మించెను.

ఒకనాఁడు పితృకర్మను జేయుటకై మృగమాంసమును పచ నము చేయ కలంకమతి యగు యా మాయా సూపకారికి నియమించి తాను నిజపురోహితునిని మంత్రితునిఁజేసి భోజనంబిడు వేళయందు సూపకారి గొని వచ్చిన మాంసమును వడ్డన గావించెను. అయ్యది నరమాంసముగ గ్రహించి ఆ వసిష్టమానీంద్రుఁడు అలుకఁజెంది తన కయోగ్యమైన పిశితమును వడ్డన గావించినందులకు రాజేంద్రుని తూల నాడుచు దైత్యుఁడవుఁ గమ్మని శపియించెను. అప్పుడా రాజపుంగ వుఁడు తాను నిరపరాధి గావున గురువునందు కోపమును వహించి ప్రతిశాపం బిచ్చు తలంపుతో జలమును గొనియున్న సమయంబున ఆతని సతి యచటి కరుదెంచి శాంతబరచెను. నిజభార్యానుకూలుఁడు గావున మిత్రసహుండు చేతియందలి జలమును ఆమె చెప్పిన పగిది తన పదములపై నిడుకొనెను. అట్లు గావించినంతనే ఆ జల స్పర్శనమువలన

మిత్రసహుని పాదములు కమలెను గనుక అదిమొదలు ఆ రాజన్యుఁడు కల్మాషపాదుండను నామముతో సార్థకమును జెందెను. అప వసిష్ఠ మహర్షి తన దివ్యదృష్టిచే జరిగిన వృత్తాంతమునెల్ల గ్రహించి ఆ రాజన్యుని అపరాధము గోరంతయును లేకుండుటను గాంచి మిక్కిలి చింతించి తుదకు పన్నెండుశతాబ్దంబులు రాక్షసత్వమును పొందిన పిమ్మట మానవుఁడై చరియించునని బలికెను.

అట్లు గురుశాపమును పొంది కల్మాషపాదుఁడు ఘోరరాక్షస రూపమును దాల్చి క్రూరుఁడై తన రాజ్యమునందలి జనులనెల్ల పీడించుచు నిష్కారుణుఁడై మృగ పక్షి పశువులాది జంతువులఁబట్టి సమయించి వాని మాంసములు దినుచు కాలంబును గడపుచు కఠినత్వమున యుండెను. ఒకనాఁడు కల్మాషుఁడు యశేన మొకింత్రమైన నమరకున్నందున దారుణమైన ఆకలి బాధకు ఓర్వఁజాలనివాఁడై, ఒక పవిత్ర విప్ర మిధునంబును గాంచినవాఁడై హఠాత్తున ఆ ద్విజుని పైఁబడి, యద్దముగ వచ్చి తత్పత్ని రోదనముఁ గావించుచుండినను లెక్కఁగొనక వానిని చంపి భక్షించెను. మహాఘోరమగు తన భర్త మరణమునకు మిక్కిలిగా విలపించి తుదకు వేసారి కోపఘూర్ణితమై యా భూసురాంగన "ఓ నృపాధమా! కృపావిహీనుఁడవై పవిత్రుఁడైన నా ప్రియునిఁ బట్టి చంపితివి గావున నీవు నీ సతిని పరిగ్రహించిన భ్రష్టజీవి వౌదువు" అని శాపంబిచ్చి తన భర్త శల్యములతో తాను అగ్నిప్రవేశ మయ్యెను. అంత భూకాంతుఁడు ద్వాదశాబ్దములు నిండినందున రాక్షసభావంబును పరిత్యజించి క్రమ్మర మానుషత్వంబును వహించి గురుజనులయొక్క ప్రేమకు పాత్రుఁడై రాజ్యము చేయుచుండెను.

ఒకనాఁడు ఆ రాజేంద్రుఁడు నిజ భార్యా సంగమాపేక్షుఁడై భూసురశాపంబును జ్ఞాపకమునకు వచ్చినను లెక్కఁగొనక భోగలాలస

తను జెందెను. పిమ్మట రాజపత్ని గర్భమును దాల్చి పదమాసానంతర మున అశ్మకుండను కుమారునిఁగనెను.

ద్విజభామినీ శాపప్రాప్తిచే కల్మాషపాదుఁడు రాజ్యమునందును భార్యాబిడ్డలయందును నిస్సంగుఁడై సర్వమును విసర్జించి సన్యాసియై దేశమునందెల్ల త్రిమ్మర మొదలిడెను.

ఇట్లు దేశదిమ్మరియై జనుచుండిన కల్మాషుఁడు తానొనరించిన బ్రహ్మహత్యాపాతకము వలన మార్గమధ్యంబున భీకరమైన దంతావళి ములతోడను, బిరుసైన వెంట్రుకలతోడను, అగ్నికణములు రాల్చు నేత్రములతోడను, కంఠమునందు పుఱ్ఱెలతోడను మహాభయంకరమైన పిశాచిని గాంచెను. గాంచినంతనే భూవరుని గుండెలు ఝల్లుమనెను. ముచ్చెమటలు బట్టెను. మహాభీతచేతస్కుఁడయ్యెను. చేయునది లేక కొంతవడికి యా భీకరారణ్యమునుండి పిశాచము వెంటఁబడి దరుము చుండఁగా కల్మాషపాదుఁడు పరుగిడఁజొచ్చెను. అప్పుడు దైవవశమున గౌతమ మహామునిని గాంచి సవినయుంబుగా దండప్రమాణంబు లాచ రించి ముకుళిత కరకమలుండై నిలచెను. దీనవదనముతో నిలఁబడియున్న ఆ రాజును గాంచి గౌతముఁడు "రాజవతంసా! నీవు రాజ్యాభరణాదు లెల్ల త్యాగము గావించి, వంటరిగ ఈ కాంతారములందుఁ దిరుగ కారణమేమి? రాజ్యమందు నీ భార్యాబిడ్డలు, బంధుప్రియులు, ప్రధాన తతులు క్షేమముగ నున్నవారా?" అని కృపాళువై పలికెను.

అప్పుడా నరేంద్రుఁడు "మునీంద్రా! నా రాజ్యమునందు పుత్ర కళత్ర సుహృజ్జనాళి యెల్లరు సౌఖ్యముగ నుండిరి. అయినను మత్కృత కల్మషంబులు పిశాచరూపమున భీకరముగ మారి నన్ను వెంటాడించు చుండెను.

గోమేధంబు లొనరించితిని. గ్రామంబులతో రథాశ్వ కరివర ముక్తాదామాదిక దానంబు లొనరించితిని, అనేక పుణ్యతీర్థములను

సేవించితిని. వ్రతములు పూజలు క్రతువులు నెన్నియో యొనర్చితి గాని నా పాపంబు లన్నియు నశించుటలేదు. అదియునుగాక యఘాప హారంబులైన ప్రాయశ్చిత్తంబు లనేకంబు లొనరించితిని. అయినను యిమ్మహాదుష్కృతంబులకు నిష్కృతి గలుగనేరకున్నది. మహాత్మా! కారుణ్యసముద్రుండవగు నీ ప్రసాదంబునంజేసి కృతార్థుఁడ నగుదును. నన్ననుసరించుచున్న ఈ బ్రహ్మహత్యామహాపాతకము నితరులకగోచరంబై నాయొక్క దృష్టిపథంబునంబడి పీడించుచు వెనువెంట నంటి యున్నది. ఇట్టి విపత్సముద్రమున మునిగియున్న నన్ను దరిజేర్చి కటాక్షింపుఁడు " అని ప్రార్థించెను.

# 7

## గోకర్ణ క్షేత్రము

మహాతపోధనుఁ డగు గౌతముఁడు దీనవదనుఁడగు రాజును కటాక్ష వీక్షణంబుల నిరీక్షించి " ఓ సాకేతపురాధినాథా! నీవు శోక ముడిగి తక్షణమే గోకర్ణస్థలికి జనుము. అయ్యది గరళకంఠుని ప్రియ మందిరంబై సుకృతక్షేత్రంబై సకలశుభప్రదంబై బహుపాపంబులను దహింపజేయునట్టిదై యుండెను.

ఆ గోకర్ణాధీశుఁడైన పరమేశ్వరుఁడు తన భక్తులకు సిరులొసంగును. బ్రహ్మహత్య, గురుద్రోహము, కృతఘ్నత మొదలైన పాపంబులును, పూర్వజన్మమున యొనరించిన యెట్టి పాపంబైనను, ఆ క్షేత్ర దర్శనమాత్రమున నిన్ను వీడి పరుగిడును. రావణ కుంభకర్ణ విభీషణాది రాక్షసవీరులు, భగీరథాది రాజన్యులు, యక్షకిన్నరులు దేవతలు, మునీశ్వరులు, దిక్పాలకులు యచ్చట దప మాచరించి ఆ దేవుని సాన్నిధ్యమున యనేకలింగములను ప్రతిష్ఠించిరి. అచ్చటనుండెడి లింగ

పూజ వలన గలిగెడునట్టియు, ఆ క్షేత్రజలములయొక్కయు మహాత్మ్యమును నుడువ శక్యముగాదు. అచ్చట ఆదిదేవుండైన ఆ పరమశివుఁడు మహాబలుఁడను నామముతో భక్తులపాలిటి కల్పవృక్షమై వెలసియుండెను.

మరియు నా మహాబలదేవుని మందిరంబునకు బ్రహ్మ విష్ణువులును, వసు రుద్రాదిత్య విశ్వేదేవ మరుద్గణంబులును, చంద్ర సూర్యాది గ్రహంబులును, విమానారూఢులై ప్రథమద్వారంబున వసియించియుందురు. యముఁడు దేవేంద్రుఁడు యాదిగా గలవారు దక్షిణద్వారంబున సేవించియుందురు. వరుణుఁడు గంగాది మహానదీదేవతలతో పశ్చిమద్వారంబున భద్రముగా కావలిగాయుచుండును. భద్రకర్ణియు, సప్తమాతృకలును, చండికాది దేవతలును, ఉత్తరద్వారంబున కొలిచియుందురు. విశ్వావసు చిత్రరథాది గంధర్వులు ఆ మహాదేవుని యెదుటఁ గానమును చేయుచుందురు. రంభోర్వశీ మేనకా తిలోత్తమాది అప్సరసలు భగవంతుని సాన్నిధ్యంబున నాట్యమును సల్పుచుందురు. వశిష్ట కస్యప కణ్వ విశ్వామిత్ర అత్రి భరద్వాజ జాబాలి నారద సనక సనందనాది మహామునీంద్రులు మరియొక భాగమున ధ్యానము గావింపుచుందురు. యతి బ్రహ్మచారి స్నాతక వ్రత జటావల్కలాంబరధారులును, యోగులును, తాపసులును నా చంద్రశేఖరు నారాధింపుచుందురు. తక్కంగాగల దేవ గంధర్వ కిన్నర కింపురుష చారణ సిద్ధ విద్యాధర గరుడోరగ భూత భేతాళ యక్ష రాక్షసులు ఆ వృషభధ్వజునిముందట నాడుచు పాడుచు జయ జయ శబ్దంబులతో స్తోత్రంబు లాచరింపుచు యథేష్టభోగంబు లనుభవింపుచు నిత్యానందంబున సుఖంబుగ నుందురు.

మరియు దశకంఠుఁడు ఆ మహాబలుని యతి భక్తితో పూజింపుచు మహావైభవమును బొందెను. తొల్లి యొకప్పుడు అగస్త్య

మహాముని గారీమని గూర్చి ఘోరతప మాచరించి జగ మంతటిచేతి నున్న నుతింపఁబడెను. వేల్పు లందరకును మహాబలదేవుఁడే సార్వ భౌముఁడు. స్థావర జంగమాత్మకమైన ఈ విశ్వమంతయు యీ విశ్వ నాథుని యధీనమం దున్నది. ఆశేఁడు కృతయుగంబున శ్వేతవర్ణంబు తోడను, త్రేతాయుగంబున రక్తవర్ణంబుతోడను, ద్వాపరంబున పీత వర్ణంబుతోడను, కలియుగంబున కృష్ణవర్ణంబును గలిగి వెలయుచుం డును. మాఘకృష్ణ చతుర్దశియందు ఆ పరమేశ్వరుని బిల్వదళములతో అతి భక్తిశ్రద్ధలతో నెవ్వరైన పూజింతురేని ఫలితములను అతి సూక్ష్మ ముగఁ బడయుఁగలరు" అని గోకర్ణమహాత్మ్యమునెల్ల యీ రాజన్యునకు విన్నవించి ఆ గౌతమమునీశ్వరుఁడు తా నప్పుడే గోకర్ణమునుండి వచ్చి నట్లును, అచ్చట యొకచిత్రమును గాంచినట్లును చెప్పదొడంగెను.

# 8
## దీనురాలు

పూర్వ మొకప్పుడు యాజ్ఞ్యకులసంభవుండైన సకలశాస్త్ర పారంగతుఁడగు ఒక బ్రాహ్మణుఁడు కలఁడు. అతనికి రూపవతి యగు కన్యక జనియించెను. ఆమె దిన దిన ప్రవర్ధమానయై గారాబమునఁ బెరుఁగుచుండెను. ఇట్లుండ కొన్నిదినముల కామె యవ్వనవతికాగా తగిన వరున కిచ్చి వేదోక్తవిధిని వివాహ మొనరించెను. కాని దైవ విధిచే ఆపె మగఁడు కాలగతిజెందెను.

వాలుకన్నులతోడను, బిగిచన్నులతోడను, పట్టువైన పిరుం దులతోడను, అబ్జరాగములవంటి కరాగ్రములతోడను, బాలచంద్రునిఁ బోలు చక్కని ఫాలదేశమును గలిఁగి భావజాస్త్రమువగిది నొప్పి యున్న యీ యౌవ్వనవతి కామాస్త్రంబుల కోర్వఁజాలక లజ్జను వీడి గతశేముషియై కాముకులను గూడి నిరంతరము కామక్రీడలయందు

జరించుచుండెను. ఇట్లు జీవాశ్లేషణ చుంబనాది సురతక్రీడా విశేషంబు లతో వర్తించుచు కాలక్రమమున గర్భవతి యయ్యెను. అప్పుడామెను జ్ఞాతి బంధువర్గం బంతయు పరిత్యజించగ ధనికుండగు నొక శూద్రుని ఆదరమును గొని వాని గృహంబున కేగి వానితో గూడి మధుపాన మును జేయుచు, మాంసభక్షణమును గావించుచు ఒకేరీతిని కులట వృత్తిని కాలము గడపుచుండెను.

ఒకనాటిరేయి యామె మధుమద పరవశయై మేషమాంస భక్షణాసక్తయై కరవాలమును చేబూని గొరియలు గోవత్సంబులు యున్న సాలవద్దకు జని తామసమున మేషమని దలంచి ఒక గోవత్స మును ఖండించెను. అప్పుడది యాక్రోశింపగా ఆమె విహ్వాల మతియై 'శివ శివ' యని నుడివి మాంసభక్షణాసక్త గలదగుటచే ఆ మాంసమును కొంత భక్షించి, తక్కుంగల భాగ మట్లునిచి, శార్దూల మొకటి గోష్ఠంబునం జొరబడి ఆ వత్సమును జంపెనని మరు చటిదినమున పురమంతయు జాటెను. పౌరు లెల్లరు అయ్యది గని నిజమని తలచి కొంతవడి విచారించి తమ తమ నెలవుల కరిగిరి.

ఇవ్విధంబున ఆ కాంత కొంత కాలం బా శూద్రనాయకునిం గూడి యథేచ్ఛావిహారంబుల వర్తించి యమసదనమునకరిగెను. అప్పుడు యమధర్మ్ముడు చిత్రగుప్తునివలన యా కులటయొక్క వృత్తాంతం బెల్ల యారసి దుర్గతికిం ద్రోయించెను. పిమ్మట కాలసూత్ర తామిస్ర తప్తదారు యంత్రతప్త పాషాణ శూలారోహణ వైతరణీ కుంభీపాక మహా కార వాది ఘోరనరకంబుల ననుభవించి దండధరుని శాసనంబున తిరిగి భూ లోకమందు చండాలకులానం బుట్టి జాత్యంధతయు, రోగభూయిష్టయు, క్రిమిసంకులవ్రణయునై భిక్షాటనంబు సేయుచు సంచరించుచుండెను.

ఉత్తమంబైన మాఘమాసమున నిర్మల కృష్ణపక్ష చతుర్దశి యందు గోకర్ణక్షేత్రమందు జరిగెడు మహాబల దేవోత్సవమును జూడ సకల దేశముల నుండియు జతలుగూడి వేలకొలది జను లరుదెంచిరి. సౌరాష్ట్రాంగ వంగ కళింగ పాంచాల ఆంధ్ర కర్ణాటక కాశ్మీర ద్రావిడ చోళ పాండ్య కురుక్షేత్ర కాశీదేశ భూపాలకులు భేరీ ధం ధణార్భటులతో డోలికాశ్వరథ గజాశ్వారూఢులై యరుదెంచిరి. శాండిల్య అత్రి మరీచి వసిష్ట వ్యాస కాత్యాయన వేదవ్యాస కణ్వ శుక అగస్త్య దూర్వాస విశ్వామిత్ర మైత్రేయ గౌతమ మార్కండేయ నారదాది మహామునులు విచ్చేసిరి. మరియు యతులు బ్రహ్మచారులు గృహస్థ వానప్రస్థ పతి భర్తృక వారకామినీ జార వధూటికాదులు దూతికాజన పతితులు, సంగులు అంధులు బౌద్ధులు సిద్ధులు యోగులు తండోపతండములుగ వచ్చిరి.

అంత ఒక మధ్యాహ్నసమయమున గౌతమ మహామునీంద్రుడు సమయ కృత్యముల నెల్లదీర్చి ఒక వృక్షచ్ఛాయయందు కూర్చొని వెడలుచున్న ప్రజలను అతివేడుకతోఁ జూచుచుండెను. అట్టి సమయమందు ఛండాలియు, అంధయు క్రిమికుల సంకులవ్రణయు జగత్ప్రతిమానవ యాచమానయు కుమతియు లోష్టపాణియు కుత్సితరూపియు నైన యొక వృద్ధవనితను గాంచెను. ఆమె ఆకలిచే మలమల మాడుచు అతి దీనత్వమున ఆగోకర్ణక్షేత్రమున వీధులందు భిక్షమునకై యరచుచు బోవుచుండెను.

“ఓ పుణ్యాత్ములారా ! నేను బంధుమిత్ర జ్ఞాతివర్గము లేని దానను. పతి వివర్జితురాలను. తినుట కన్నము లేని కులహీనురాలను. కట్ట సరియైన వస్త్రము లేని కష్టజీవిని దుర్గంధ దూషిత దుష్టవిగ్రహురాలను. భోగశూన్యనై రోగపీడితనై యుంటిని. దిక్కుమాలినట్టి జుక్కుమానవురాలను. అట్టి నాపై కరుణ గలిగి కొంత భిక్షమిడుఁడు.

ఈశ్వరుని పూజ యెన్నఁడును యొనర్చినదానను గాను. ఆ మహేశ్వరుని పర్వదినంబులందు యుపవాసంబులు సల్పి యెరుంగను. ఆ భక్తవశంకరుని లింగరూపమైన యాకారమును యెన్నఁడును కన్నులారఁ గాంచనైతిని. మరియు శ్రీ పార్వతీదేవిని భజింపనేరని దౌర్భాగ్యరాలను. పంచాక్షరీ మంత్రమును పఠియింపని పాపాత్మురాలను. ఆ చంద్రశేఖరుని కథాశ్రవణ వర్జితనైన దరిద్రురాలను. చేతులార యెన్నఁడును యెద్దియును భగవంతుని కర్పింపని దిక్కుమాలినదానను. అయ్యయ్యో! ఆకలె హెచ్చుగ నుండెను. "ఓ యన్నలారా! ఈ దీనురాలిపై దయకలిగి గుప్పెడు అన్నమును బెట్టి రక్షింపుఁడు" అని తల్లడిల్లుచు నమస్కరించుచు సకలదిక్కులందు సంచరించుచు పేరాకటికిఁ జిక్కి అతి దీనాతిదీనముగ నేడ్చుచుండెను. అయ్యది మహేశ్వ రారాధనా సమయం బగుటచే యా దీనురాలి నెవ్వరును జూడరైరి.

ఇట్లు రోదన మొనర్చుచు పోవుచుండిన ఆ వృద్ధురాలను యొక దుర్మార్గుఁడు గాంచి భిక్షమని నుడువుచు గుప్పెడు బిల్వదళములను ఆమె చేతులలో బడవైచి వెడలిపోయెను. అప్పుడామె అయ్యది తిను పదార్థము కాదని గ్రహించి ఒక రాతిపైఁ బడవైచి చేరువనున్న కాళికాలయమువద్ద అమితమైన యాకలిచే శోషించి విగతజీవియయ్యెను.

ఆ క్షణంబున యీశ్వరాజ్ఞాబద్ధులై విభూతి రుద్రాక్ష మాలికా ధారులును, మణిమండల భాజిత గండభాగులును, త్రిశూల ఖట్వాంగ ధారణులును, అతిశాంతులును, ధీమంతులు నైన నలువురు శివప్రియ కింకరులు విమానమును గొని యరుదెంచిరి, గౌతమ మునీంద్రుఁడు ఇదియంతయు గాంచి యాశ్చర్యపడి శివకింకరుల చెంతకరిగి వినయ విధేయుఁడై భయభక్తులతో వారిని "అయ్యలారా! శంకరస్వరూపుల గు మీా రెవ్వరు? యీా పుష్పకమేటికి?" అని యడిగెను. అప్పుడు వారు మోమున చిరునవ్వు తాండవింప సంతోషముతోడను మృదు

మధుర వచనములతోడను "మునీంద్రా! మేము గగనమునుండి వచ్చి యుంటిమి. నగజారమణుని కింకరులము. ఇప్పుడు మృతిచెందిన యీ దీనురాలి దేహమును గొనిరమ్మని మహాదేవుని ఆజ్ఞయైనది. సుప్రసం న్నుండును, భక్తరక్షకుండును నగు ఆ పరమేశ్వరుని మహాత్మ్యము లత్య ద్భుతములు. భక్తుల కతఁడు అత్యంతసులభుఁడు. అల్పసంతోషి. శివ ప్రీతికై జేయు పను లెవ్వియైనను, యెంత యల్పములైనను యమో ఘంబులై యక్షయఫలంబు లొసంగును" అని పలికిన వారిని గాంచి గౌతముఁడు మహాత్ములారా! ఈ నీచురాలు కైలాసమునకు రాఁ దగునా? దీనికి దివ్యవిమాన మెక్క అర్హతగలదా? అంతటి యదృష్ట మును పొందుట కీమె యొనరించిన వ్రతజపము లెవ్వి? క్రతువు లెవ్వి? ఈమె యట్టి యర్హతను గలిగియుండుటకు చలి బందిళ్ళను కట్టించి యుండలేదు. వీధులందు అన్నసత్రంబులు పెట్టించియుండలేదు. గుడి గోపురాదులు నిర్మించియుండలేదు. క్షేత్రములకుఁ జని షోడశ దాన ములు గావించలేదు. భళిరే! ఇట్టి విమానము నెక్క యీమె గావించిన పుణ్య మెద్దియోకదా? నిత్యానిత్య వివేకములుకలిగి ప్రవర్తించెనో! లేక సత్యవ్రతయై చరియించెనో! లేక శివకథాశ్రవణమును గావించెనో! దయయుంచి మహాత్ములారా! నాకు తెలియఁబలుకుడు. నిక్కముగ ఆ విశ్వేశ్వరుని మహిమలు విశ్వమున కంతకును పరమాద్భుతములు" అని పలికెను.

అప్పుడు శివకింకరులు కల్మషపూరితంబైన ఆమెయొక్క పూర్వ జన్మ వృత్తాంతంబంతయు గౌతమునకు నివేదించిరి. అది అంతయు విని అట్టి పాపభూయిష్టకు కైవల్యసంప్రాప్తి యెట్లు గలిగెనని గౌతముఁడు యడిగెను. అట్లు పలికినంతనే ఆ మహాత్ములు "మునీంద్రా! పూర్వ జన్మంబున యీమె అన్నదాన విహీన యగుటచే ఈ జన్మంబున క్షుత్పి పాసార్తయై క్రుస్సెను. కామాంధురాలై కన్నుఁగానకుండున జాత్యం

ధయై భూమిపై జన్మించెను. గోవత్సమును జంపి దాని మాంసమును దినినందున ఛండాలయోనియందుఁ బుట్టెను. విధవయై జారవిద్యలతో మెలంగిన కతంబున రోగపీడిత యయ్యెను. మరియు మద్యపానము మాంసభక్షణము చేసియున్నందున గ్రహశూల మొదలుగాగల బాధచే పీడింపఁబడెను. దానధర్మములు వ్రతకర్మలు ఆచరించనందున నిర్భాగ్యురాలై ఛండాలత్వము వహించెను. శ్రీకరంబగు శివరాత్రియను మాఘకృష్ణ చతుర్దశీ దినమున యీమెకు బిల్వార్చనంబు సంఘటించెను. గాన జన్మాంతరార్జితదోషంబులన్నియు ఈమెను విడిచిపోయినవి. మరియు పుణ్యక్షేత్రమగు ఈ గోకర్ణమునందు మహాశివరాత్రి దినమున ప్రాణములు బాసెను గావున ఈమె పుణ్య వైభవమును జెంది దేవదేవుని కరుణచే భద్రకరమైన కైవల్యపదమును పొంది దివ్యమైన విమానమును ఆరోహింపఁగలిగెను. పూర్వజన్మమందు మదాంధతచే గోవత్సమును జంపునపుడు 'శివశివా' యని భీతిచే పలికెను. అందుచే పాపములెల్ల నశించెను. నిర్మలభక్తితో ఆ మహాదేవుని భజించిన మర్త్యులకు మోక్షప్రాప్తి తప్పక గలుగును" అని ఆ ఛండాలి పూర్వవృత్తాంతంబంతయు నెరింగించి ఆ శివకింకరులు ఆక్షణమాత్రమందే ఆయింతిని దివ్యవిమానంబున నెక్కించుకొని శివలోకమునకుఁ గొనిపోవుచుండిరి. అప్పు డామె దివ్యాభరణభూషితయై సుగంధవిలేపితయై తన దుష్కృతములెల్ల పోయి తనకెట్లు అట్టి మహావైభవము కలిగెనో యని ఆశ్చర్యంబందుచు పరమేశ్వరుని స్తుతించుచు గంధర్వగానంబు నాలకించుచు విద్యాధర కీర్తనంబు లాలోకించుచు బరమానందంబున శివలోకమునకుఁ జని యీశ్వరసాన్నిధ్యంబున సుఖంబుగ నుండెను.

కైవల్యమును బొందిన దీనురాలి వృత్తాంతంబంతయు సావధానచిత్తముతో విన్నవాఁడై గల్మాషపాదుఁడు గౌతమ మహామునిని శివలోకమెట్లుండునని వినయముతో ప్రశ్నించెను. "ఓ భూవరా! పుణ్యాత్ము

లెల్లరు మరణానంతరమున శివలోకమున కరిగెదరు. వారి కచట మరణ వేదన గాని ఆకలిబాధ గాని దప్పికగాని ఆశగాని ము[illegible] గాని మరెట్టి కష్టము గాని యుండక నిర్మలముగ వసియింపఁగలుగుదురు. ఆ లోకమందు సూర్యచంద్రాదులు ప్రకాశింపరు. మునులు సిద్ధులు యోగులు మహానందముతో యుందురు. అందున్న పుణ్యజనులకు పునర్జన్మ లేక అనపాయస్థితియందుందురు. గురుభక్తులు, మంచి అంతఃకరణమును కలవారు, సాధుజనులు, పరోపకారపరులు, తత్త్వజ్ఞులు మొదలైనవారు అచ్చట చిరకాల ముందురు" అని చెప్పి గౌతమ మహర్షి రాజునుజూచి "నీ వింక ఆలస్యము చేయవలదు. సత్వరము గోకర్ణక్షేత్రమునకుఁ జనుము. నీ దుష్కృతంబులన్నియు నశించును. నీకు ముక్తిఫలములు కలుగును. భవిష్యత్కాలంబున నీ వంశమున భగవంతుఁడైన శ్రీ మహావిష్ణువు శ్రీరామ నామంబున నవతరించి నీయొక్క వంశమునకు గొప్పకీర్తిని తేఁగలఁడు" అని యానతిచ్చి తాపసోత్తముఁడు నిజాశ్రమంబునకుఁ జనెను.

పిమ్మట కల్మాషపాదుఁడు గౌతమమునీంద్రుని ఆజ్ఞాప్రకారము గోకర్ణంబునకుఁ జని గిరిజారమణుండగు శ్రీకంఠుని సేవించి పాపవిముక్తుఁడై సాకేతంబునకుఁ జని ధర్మయుక్తముగ రాజ్య మేలుచుండెను. అంత కొంతకాలమునకు శివభక్తాపరుఁడగు ఆ యుర్వీనాథుఁడు శివలోకమున కరిగి మహాదేవుని చరణసాన్నిధ్యమం దుండెను.

## 9

## దీపకలికా ప్రభావము

ఇట్లు శివరాత్రిమహత్త్వమును గూర్చి శౌనకాది మహామునులను తన మృదుమధుర వాక్సుధారలచే ఆనందసాగరంబున నోలలాడించి, సూతపౌరాణికుండు దీపకలికను గూర్చి "ఓ మహామును

లారా! మాస సంవత్సర శివరాత్రులయందు శివసన్నిధానమున శివ ప్రీత్యర్థము మంగళప్రదంబులగు దీపంబులు వెలిగించినచో నద్భుతప్రభావము గలుగును. శివుండు ప్రీతిజెంది ఇహలోకమున సమస్త భోగైశ్వర్యంబులను, సంతానమును, శాశ్వతసుఖానందములను గలుగఁజేసి మరణానంతరంబున దివ్యతేజోమయమైన తన కైలాసమున నిత్యనిరామయ సుఖంబుల ననుభవింపఁజేయును. ఇందుల కొక్క నిదర్శనంబు గలదు. శ్రద్ధావహులరై వినుండు.—

నిషధ యను నొక సుందరమైన పట్టణము గలదు. దానిని దాశరాజు పరిపాలించుచుండెను. అతఁడు కుముద్వతి యను నొక సౌందర్యవతి యగు రాజకన్యకను వరించి వివాహమాడెను. కాని అతఁడు కామాతురుఁడై భోగాసక్తతం జేసి నానా జాతి స్త్రీలను రమించుచు అనాచారుఁడై స్వేచ్ఛావిహారమును గావించు చుండెను. అయినను అతఁ డెంతటి కాముకుఁడో యంతటి పరమభక్తుఁడు దయార్ద్రహృదయుఁడు. ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించు చుండెను. అనేకమైన శివమందిరములను గోపుర మంటపములను కట్టించియు, సహస్ర ఘటాభిషేకముల నాచరించియు మహోత్సవములను జరుపుచు అనుదినము శివమందిరమును దీపమాలికలతో నలంకరించి, బిల్వదళములతో పూజించుచు ఆనందపారవశ్యమునుఁ జెందు చుండును. ఈ వింతచర్యలకు మది నాశ్చర్యమును జెంది ధీరమతి యగు కుముద్వతి యేకాంతమున నిజభర్తనుగాంచి "మనోనాథా! మీకు కోపము రాకుండెనేని నా దొక్క మనవిగలదు. మీకీ దుర్బుద్ధి యేమి? ఈ జారకృత్యము లేమి? జారిణీ సహవాసమును విడువలేని మీకీ భక్తజనగోష్ఠి యెందులకు? సద్గ్రంథపఠన మెందులకు? శివపాదతీర్థము పానముచేసిన నోటితో వేశ్యాధరపానము నెట్లు చేయుచున్నారు? మహాభక్తిశ్రద్ధలతో దీపారాధనమును గావించి

దివ్యమంగళస్వరూపులగు గౌరీశంకరులను దర్శించిన నేత్రములతో వేశ్యావదనమును గాంచి యెట్లు మెచ్చుకొనుచుంటిరి ? స్వామిని పూజించు పవిత్రహస్తములతో కులటయగు వేశ్యనెట్లు స్పృశించుచుంటిరి ? ధనకామినితో పొందుజెందుట మీకు హేయముగొల్పలేదా ? గంగాస్నాన మాచరించి పరిశుద్ధులైనవారు వెంటనే దొమ్మరిగుడిసెలో నూరి యపవిత్రులు కానేల ? కనుక మీ భక్తికి మీ యోగ్యతకు, మీ విద్యకు నీచస్త్రీ సాంగత్యము తగదు. దయయుంచి నా ప్రార్థన త్రోసిపుచ్చక యింతటినుండి యిట్టి దుష్టప్రవర్తనము మానుడు " అని దీనముగ వేడుకొనెను.

అప్పుడా రాజేంద్రుఁడు చిరునవ్వుతో "ప్రియసఖీ ! నీవు చెప్పిన విషయములెల్ల నే నెరుఁగనవి కావు. సద్బుద్ధులకే దైవము కర్మసూత్రము మూలకారణమో, దుర్బుద్ధులకును ఆ రెండే హేతువులని నమ్ముము. అందులకు నా ప్రజ్ఞావిశేషముగాని యిందులకు నా వివేకహీనత గాని కారణము గాదని తెలిసికొనుము. సుయోగకాలము తటస్థించినప్పుడు నా చిత్తము దానియంతట నదియే సత్యధర్మపథముల నడువగలదు. అంతవరకు నోరిమి వహింపుము. అది యట్లుంచి నేను చెప్పఁబోవు నా పూర్వజన్మవృత్తాంతము నెల్ల సావధానచిత్తవై వినుము.

పూర్వము నేను అంపావగరమను పట్టణమందు శునకమునై పుట్టి ప్రతిగృహమునకును ప్రతి వీధియందును దిరుగుచు, జనభుక్తశేషమును భుజించుచు కొన్నిసంవత్సరము లచటఁ గడపితిని. అంత నొక మాసశివరాత్రియందు పురజను లనేకు లొక్క శివాలయమున కరిగి దీపమాలికల నొసఁగి అమృతాభిషేకము నాచరింపుచుండిరి. నలుదిక్కులనుండి వచ్చిన సకలజనులు మక్కువతో నొసగిన ఆ దీపమాలికల వలన ఆ ముక్కంటియొక్క భవనము నక్షత్రమండలమువలె

విరాజిల్లుచుండెను. ఇట్లున్న సమయమున దేవుని పీఠముపై యుంచ బడిన భక్ష్యముల నారగించబోయి నిశ్చలతేజంబున వెలుగుచున్న ఆ దీపములను గాంచియు, అచ్చటనున్న అర్చకు లొనరించుచున్న వేద ధ్వనులను వినుచును నిలువబడియుండగా అచ్చట నున్నవారు నన్ను దండించి తరిమివైచిరి. పిమ్మట నేను కబళమునకై వెదకుచుఁ బోవు చుండ కొందరు దుర్మార్గులు కరుణాహీనులై శరమును సంధించి ఆ శివాగారప్రదేశంబునఁ బడవేసిరి. మహేశ్వరనివాసంబైన ఆ పుణ్య క్షేత్రమందు కృష్ణచతుర్దశీ ప్రదోష పుణ్యకాలంబున విరూపాక్షుని సాన్నిధ్యంబున దీపమాలికల నవలోకించుచు నిరసనత్వము నొందితిని గాన నిక్రృష్టంబైన శునకదేహంబును వీడి దివ్యదేహమునుఁ దాల్చి విమానారూఢుండనై కొంతకాలంబు స్వర్గభోగంబుల ననుభవించి పిమ్మట నిషధరాజ్యమునకు రాజునై జన్మించితిని. ఇది నా పూర్వ వృత్తాంతము. నాకు ప్రియపత్నివి గావున నీ రహస్యము నీకు తెలియఁ బలికితిని. నీవు అప్పరమేశ్వరుని భక్తితో పూజింతువేని మహాను భావుండగు ఆ భక్తవత్సలుఁడు నీకు ఇహపరసౌఖ్యంబు లొసంగును" అని బలికిన కుముద్వతి ఆశ్చర్యముజెంది పూర్వజన్మజ్ఞాన మెట్లు కలిగె నని ప్రశ్నింపగా దీపమాలికాలోకనము వలన భూత భవిష్యతు వర్త మాన జ్ఞానసిద్ధిని గలిగియుంటినని రాజు పలికెను. మరియు తాను దీపమాలికలను వీక్షించుచు ప్రాణములను బాసెను గావున ఈ జన్మ మందు ఆ శంకరునకు దీపమాలికల నర్పించు భాగ్యము, రాజత్వము, శివపూజాశక్తి కలిగినదనియు, తనపూర్వజన్మమున మరెట్టి సుకృతము లను ఆచరించనందున దుష్టవృత్తి తన్ను వీడలేదనియు నుడివెను. పిమ్మట కుముద్వతి "నాథా! మీరు మహానుభావులు. త్రికాలజ్ఞులు. విశేషించి సుజ్ఞానులు. అందువలన మీరు భూత భవిష్యతు వర్తమాన కాలములందు జరిగిన జరుగుచున్న జరుగబోవు సంగతులను

జెప్పగలుగుచుంటిరి. ఇప్పుడు దయయుంచి నా యొక్క పూర్వ వృత్తాంతమును కూడ దెలియజెప్పుడు" అని భర్తను వేడెను. అప్పుడు దాశరాజు నిజభార్య కోరికను సఫలిత మొనరింప సంకల్పించి "ఓ గజగామినీ! నీవు పూర్వమున యొక కపోతివై ఆహారమును నోటం గరచుకొని గగనంబునం బోవుచుండ యొక డేగ అయ్యాదిగాంచి నిన్ను వెంటాడించెను. రౌద్రముతో వచ్చుచున్న ఆ డేగనుజూచి నీవు భయమంది ఒక శివాలయముచుట్టుం దిరుగుచు శోషించి పోలేక ధ్వజ స్తంభముపై వ్రాలగా ఆ డేగ కృపావిహీనయై నీ ప్రాణములను హరించి మాంసఖండమును గొనిపోయెను. పురహరుని మందిరమునకు ప్రదక్షిణము గావించి ఆ మహాదేవుని యెదుట తనువుచు జాసితివి గావున పుణ్యముంగొని రాజకుమార్తివై జన్మించితివి" అని చెప్పిన కుముద్వతి అమందానందముం జెంది "మనోవల్లభా! నీవు ఆ నీలగ్రీవుని మహోత్సవంబులు నిత్యము ఆచరించి కాలజ్ఞానమును గల్గియుంటివి గనుక ఈ భూలోకమున నీకంటె ఘను డెవ్వండును లేడు. నా మనవూర్తిగా వేడుచుంటిని గాన క్షమించి మన భవిష్యజ్జన్మవృత్తాంతమును గూడ వినిపింపుఁడు" అని కోరంగా దాశరాజు సంతసించి "దేవీ! నీమృదుభాష లారయగ సుధారసములు. ఇతరు లెవ్వరును నీ వలెఁ బలుకనేరరు. భావిభవంబులనుగూడఁ దెలియఁబలికెద వినుము. నీవు రాఁబోవు జన్మంబున సృంజయేశ్వరుని గారాబుపట్టివై జన్మించి సింధుభూపాలుఁడనగు నన్ను పతిగా బడయఁగలవు. తృతీయజన్మంబున నేను సౌరాష్ట్రాధీశుఁడనై జన్మించెదను. నీవు కళింగరాజన్యునకు కూరిమిపట్టివై జననమొంది నన్ను బడయఁగలవు. చతుర్థభవమునందు గాంధార ప్రభుఁడ నగు నన్ను పాంచాల రాజ తనయవై గూడుదువు. పంచమభవంబున నేను అవంతికి రాజునై జననమొంది బహుబల సంపన్నుఁడనై యుండ నీవు దశార్ణమహీపతికి మురిపెంపు పుత్రివై

నన్ను మోహించి పరిణయమాడుదువు. మరల షష్ఠభవంబునందు బ్రహ్మావర్తదేశంబునందు ధరణీనాథుఁడనై జనించిన నన్ను అత్యంతానురాగముతో నీవు యయాతి వంశరత్నమవై జన్మించి పాణిగ్రహణము నొందుదువు.

మరియు ఓ పద్మాయతాక్షీ! సప్తమజన్మమున నేను పాండ్యభూవరుఁడనై జన్మించి దాన క్షాత్ర సాహస ధైర్యాది సద్గుణములఁ బ్రఖ్యాతిఁ బ్రఖ్యాతి పొందుచుండ నీవు సౌందర్యాతిశయములతో వసుమతి యను పేరుతో వైదర్భివై జన్మింతువు. అంత సకలదేశంబుల నుండి రాజకుమారులు నీ స్వయంవరంబునకు వచ్చియుండ వారి నందరిని విడచి నన్ను వరింతువు. అంతట వారందరు యేకమై దంతిప్రాముఖ్యసేనాతతితో మహోద్ధాములై ఘోరసంగ్రామకాంక్షతో వచ్చి నన్ను ముట్టడింతురు. అప్పుడు చండాటోపములచే ముట్టడించిన పరక్ష్మాపాలుర నెల్లరను తీవ్రకోదండ విముక్త నిశితశర పరంపరలతో కరి స్యందన ఘోటకాదులచే ఖండీభూతులను జేసి ధక్కానాము మ్రోయుచుండ నిన్నుఁగొని తెత్తును. అంత మహోహర్షముతో నిన్ను నగరంబునకుఁ గొనివచ్చి శుభలగ్నమున వివాహమొనర్చుకొని యశ్వమేధాది యాగము లాచరించి శైవతతికి మహాదానము లొసంగుదును.

ఇవ్విధముగ సకలప్రజానురంజకంబుగా బహువర్షంబులు రాజ్యమును బాలించి యనంతరంబున నిజనందనునకుఁ బట్టముఁగట్టి తపోవనికిఁ జని యచ్చట అగస్త్యమహాముని గాంచి వినయముతో నాతనికి ప్రణమిల్లి, ఆ మహామహుని వలన ఆత్మవిజ్ఞానంబును బడసి కొంత కాలమునకు యీ తనువును చాలించి పునర్జన్మరహితంబైన శివలోకంబున శివసాయుజ్యంబు నొందియుందుము. ఇటుమీదట మనకు జన్మంబులు లేవు" అని భార్యకుఁ దెలిపెను.

తదనంతరంబున ఆ దంపతులు మహాదేవుండైన శ్రీ విరూపాక్షుని యారాధించుచు అనేక వత్సరంబులు సౌఖ్యంబుల ననుభవించి మరియు సప్తజన్మంబులు రాజ్యంబు పాలించి యంత్యంబున శివచరణ సేవను జేయుచు కైలాసమున సుఖంబుగ నుండిరి.

# 10

## చంద్రసేనభూపాలుఁడు

దీపకళికా ప్రభావమును జెప్పి సూతమునీంద్రుఁడు "ఓ ముని శ్రేష్ఠులారా! స్త్రీలైనను పురుషులైనను సజ్జన దుర్జనులైనను పవిత్రులైనను అపవిత్రులైనను సర్వకాల సర్వావస్థలయందును పార్వతీపరమేశ్వరుల పూజ లాచరింతురేని వారు సంసృతిబంధముక్తులై మోక్షప్రాప్తిఁ జెంది శంభుసన్నిధానమున కేగెదరు. మరియు యీ యర్థమున కొక ఇతిహాసము గలదు. అయ్యది వినిపించెదను. సావధానముగ వినుండు".—

సజ్జనజనుల కాశ్రయమై సమున్నతమైన గోపుర భర్మహర్మ్యంబులతో విరాజిల్లుచు ఉజ్జయిని యను పట్టణ మొకటి కలదు. ఆ నగరమును గుసుమాస్త్రసమానుఁడై విద్వాంసుఁడై రాజనీతిదక్షుఁడగు చంద్రసేనుఁడను రాజన్యుఁడు ఉదారభావముతో ప్రజల నేలుచుండెను. ఆ రాష్ట్రము గ్రహపీడాదిక్షోభలు లేక సకలవైభవములతోడను విరాజిల్లుచుండెను. అతఁడు మహాధైర్యశాలియు, బాహుబలయుక్తుఁడునునై యుండుటచే శాత్రవులెల్ల అతనిపై దాడివెడలుటకు భీతిజెందుచుండిరి. మరియు అతఁడు నిత్యము అంబికామాధవుల నారాధించుచు యోగులకు సిద్ధులకు వైరాగ్యులకు కోరినధనము నిచ్చుచుండెడివాఁడు.

ఇట్లుండ నొకనాఁడు విభూతి లేపనములనుఁ దాల్చి, మృగ చర్మాంబరములను ధరించి, దండకమండలాదులతో మహేశ్వరభక్తుఁడగు మాణిభద్రుండను తపోధనుఁడు చంద్రసేనుని ఆస్థానమున కరుదెంచెను. అప్పుడు చంద్రసేనుఁడు మునీంద్రున కుచిత మర్యాదలు గావించి మజ్జనభోజనపాన శయ్యాదులనెల్ల అమర్చి యాతని కెక్కువ ప్రీతిని గొల్పెను. రాజన్యుని భక్తిశ్రద్ధలకు మెచ్చి మాణిభద్రుఁడు ఒక దివ్యరత్నము నాతని కిచ్చెను. పిదప శివపారిషదముఖ్యుఁడగు ఆ మాణిభద్రుఁడు నృపాలుని హస్తంబుఁ బట్టి యిష్టసల్లాపంబులతో "ఓ నృపవర్యా! ఈ రత్నమును నీవు యెల్లప్పుడును గళమునందు ధరింపుము. ఇయ్యది అత్యంత శుభప్రదంబై నీకు వలయునంత ధనమును చేకూర్చును" అని నుడివి దానియొక్క ప్రభావం బంతయు ఆతనికిఁ బోధించి ఆ శివయోగి చనెను. మునీంద్రుఁడు చెప్పిన చొప్పున యా నృపాలుఁడు దానిని గళమునఁ ధరించి కౌస్తుభధరుఁడగు రమావల్లభునివలె వెలుంగుచుండెను. సూర్యప్రభావముతో ప్రకాశించుచున్న ఆ రత్న కాంతి సోకిన వెంటనే ప్రతివస్తువు హేమముగ మారజొచ్చెను. ఇట్లు మహాధనికుఁడై శివపూజా దురంధరుఁడై సర్వజనులకు సమ్మదమగునట్లు ఆ రాజన్యుఁడు ధరాతలమును బాలించుచుండెను. సాంద్రయశోవిశాలుఁడును, సత్యవిరాజితుఁడును యగు చంద్రసేనుఁడు శౌర్య ధైర్యములందు హరిశ్చంద్ర కార్తవీర్యుని మరిపించుచు, యుపేంద్ర మహేంద్రులకు మించిన వైభవములతో వెలంగుచుండెను. ఇవ్విధముగ సామ్రాజ్యము నేలుచుండ అయ్యది దైవలబ్ధానుభవంబని తెలియఁజాలక చంద్రసేనుని సంపదలెల్ల హరింప అన్యదేశాధిపతులు వివిధ ప్రయత్నములు సల్పుచుండిరి.

ఇట్లు చంద్రసేనుని జయించవలెనని కోరికతో సౌరాష్ట్రాంగ కళింగ వంగ కురు పాంచాలాంధ్ర గాంధార వీరవంతాది భూపాలకు

